500

౫౦౦

ఆంధ్ర గ్రంథమాల — ౨౩.

# ఆంధ్ర

# ఋతుసంహారము






2572
26481

గ్రంథకర్త:

గుఱ్ఱం - వేంకటసుబ్రహ్మణ్యము

# ఆంధ్ర గ్రంథమాలలోని పుస్తకములు

| | రు. | అ. | పై. |
|---|---|---|---|
| శతకమంజరి | 1 | 8 | 0 |
| బసవపురాణము | 2 | 8 | 0 |
| బెల్గాము కాంగ్రెసు అధ్యక్షోపన్యాసము | 0 | 4 | 0 |
| ధమ్మపదము | 0 | 10 | 0 |
| జీర్ణవిజయనగరచరిత్రము | 1 | 0 | 0 |
| భీష్ముఁడు 1 0 0 కావ్యాత్మ | 2 | 0 | 0 |
| ఆత్మకథ (1-వ భాగము) | 0 | 12 | 0 |
| ఆత్మకథ (2-వ భాగము) | 1 | 0 | 0 |
| ఆంధ్రవాఙ్మయసూచిక | 1 | 0 | 0 |
| ఆంధ్రభారత కవితావిమర్శనము | 2 | 0 | 0 |
| భారతీయచిత్రకళ 1-0-0 ప్రార్థనగీతావళి | 0 | 4 | 0 |
| జీవనప్రభాతము | 1 | 8 | 0 |
| మేఘదూత 0 12 0 గీతాబోధ | 0 | 4 | 0 |
| తంజాపురాంధ్రనాయకరాజచరిత్రము | 2 | 0 | 0 |
| సబర్మతీ ఆశ్రమ నియమములు | 0 | 4 | 0 |
| అళియరామభూపాలుడు | 1 | 8 | 0 |
| నందనారు చరిత్రము | 0 | 8 | 0 |
| ఆత్మచరిత్రము | 1 | 0 | 0 |
| ఆంధ్రఋతుసంహారము | 0 | 8 | 0 |
| ఆంధ్రవిజ్ఞానసర్వస్వము సంపుటము 1-కి | 10 | 0 | 0 |

ఆంధ్ర గ్రంథమాల, ౭, తంబుసెట్టివీథి, మద్రాసు.

శ్రీ

# ఆంధ్ర ఋతుసంహారము






గ్రంథకర్త:

గుఱ్ఱం వేంకటసుబ్రహ్మణ్యము, బి. ఎ.

2872/25487.


చెన్నపురి:

ఆంధ్రపత్రికా ముద్రాలయమున

ముద్రితము.

౧౯౩౩


సర్వస్వామ్యసంకలితము]　　　　[వెల 8 అణాలు




# పరిచయవాక్యము

---

కాళిదాసు కవిచక్రవర్తి. ఋతుసంహారము సరసభావకావ్యము. సుప్రసిద్ధ కవికావ్యములకు పరిచయవాక్యము లప్రస్తుత ప్రశంసలు. సంస్కారావకాశాభావ మప్రస్తుత ప్రశంస కనాలోచితపరిణామమును గలుగ జేసినది. ఋతుసంహారకావ్యమున కాంధ్రానువాదకులు శ్రీయుత గుఱ్ఱం వేంకట సుబ్రహ్మణ్యముగా రుపోద్ఘాతమునందు కావ్యకర్తృత్వముల పరిచయప్రశంసలను ప్రమాణయుక్తముగను చేసి పరిచయావసరమును నా భారమును తొలఁగించిరి.

కావ్యములు రసానందానుభవమునకు సాధనములు. కవులు దేశకాలపాత్రాధారమునను కావ్యములను నిర్మించి రసానందమును గలుగఁజేయుదురు. కావ్యరచనయందు రసానందానుభవమునకు దేశకాలపాత్రములు లన్యోన్యాశ్రయములు. కావ్యములందు నాయి

కానాయకులు, వనప్రాసాద విహారములు, ఋతువర్ణనలు, విరహవేదనలు, భోగభాగ్యములు, శౌర్యపరాక్రమములు, శృంగార విలాస వైభవములు, వస్త్రాలంకరణములు, సూర్యచంద్రాస్తమయములు రసోదయానుభవానందములకు సాధనములు. పాత్రాధారపరమైన రసపోషణానుభవము సామాన్య కావ్యలక్ష్యము. ప్రవృత్తియందు నాయికానాయకుల లీలావిలాసముల రసానుభవము దేశకాలావచ్ఛిన్నము, పరిమితము. ప్రవృత్తియందు చరాచరప్రపంచానుభూతములైన శృంగారప్రేమవిలాసము లనవచ్ఛిన్నములు, అపరిమితములు. ప్రకృతియంతయును నిత్యమైన సౌందర్యవిభూతివిలాసవిలసితమై ఆనంద తాండవ మాడుచు ప్రేమగీతమును పాడుచున్నది. దివ్యవిభూతిద్రష్టలైన మహాకవులు ప్రకృతిశ్రుతిసమ్మేళనము చేసి ప్రేమగీతమును పాడి కావ్యరసానందమును గలుగఁజేయుదురు. కాళిదాసు శృంగార ప్రేమోపాసకుఁడు, కామారాధకుఁడు. ప్రవృత్తిసిద్ధమై విశ్వవ్యాప్తమైన కామారాధనమును

కాళిదాసు తటస్థప్రేమద్రష్టయై నాయికకు సంబోధించిన ఋతుసంహారకావ్యము రసోపాసకుల కాదరణీయము.

నాయికానాయకులహృదయారవిందము లందు ప్రసరించుచున్న ప్రేమ రసానందానుభవము ప్రవృత్తియందు సర్వత్రప్రత్యక్షముగ నున్నది. రసోపాసకులైన మహాకవులకు గ్రీష్మ వసంతములు, నగకాసారములు, వనసౌధములు, తరుగుల్మములు, కురంగ శార్దూలములు, సింహమాతంగములు, ఫణిమయూరములు, కైరవకమలములు, కుసుమసౌరభములు నాయికానాయకుల శృంగారమువలె రసానందానుభవమునకు సాధనములు. ప్రకృతిసంపదలు రసానందానుభవమునకు కేవలము సాధనములేకాక ఆధారములు. కాళిదాసు శృంగారకవి, ప్రేమోపాసకుఁడు. శృంగారప్రేమమయమైన ప్రవృత్తియందు శృంగారమహాకవి ప్రకృతిసౌందర్య ప్రేమదృశ్యములను సంభావించి సందర్శించి సంకీర్తించిన విధమును ఋతుసంహారము హృద్యముగ సువ్యక్తము చేయుచున్నది.

ఋతుసంహారము మనోహరమైన భావ కావ్యము. కావ్య మంతయును సరసము లయిన భావదృశ్యములతోనిండి ఆనంద మును గలుగఁజేయుచున్నది. సహజములైన ప్రకృతి సౌందర్యవర్ణనలు కవీంద్రుని ప్రతిభకు నిదర్శనములు. కావ్యమువిరస దుస్సహము లైన గ్రీష్మఋతుభావదృశ్యముల వర్ణనలతో నారంభమై సరసానందకరమైన వసంతఋతు దృశ్యములతో నంతమునొందుట రసానుభవా నందమునకు సాధనముగ నున్నది. నాయికా నాయకులకు షడృతువుల సంభావనవర్ణన సంకీర్తనముల మనోహరపరిణామమును కా వ్యావలోకన మవగతము చేయుచున్నది.

ఋతుసంహారమునకు విషయము మన్మథపరములైన శృంగారభావలీలావిలాస ములు. ప్రకృతియందు కామశృంగారభావవిలా సము లన్యోన్యాశ్రయములు. శృంగారవిలాస ములు కామారాధనసాధనములు. కామవిలా సములుశృంగారరసానందసాధనములు. కామ శృంగారవిలాసములు కాలప్రభావసంభవ ములై కామోపశమనప్రకోపనములకు విని యోగపడు చున్నవి.

నిదాఘు మతిశాంత మన్మథము. వసంతము వీర్యమన్మథము. గ్రీష్మము కామినీకాముకు లకు ఋతువిజయమునకును మన్మథపరాజ యమునకును, వసంతము ఋతుసంహార మునకును మన్మథవిజయమునకును సాధన ములు. ప్రకృతిసౌందర్యవిలాసములు ఋతు ధర్మానురూపముగను శృంగారవిహార భోగా వస్థలందు నాయికకు వినియోగపడగల విధ మును నాయకముఖమునను ఋతుసంహారము మనోహరముగ దెలుపుచున్నది. గ్రీష్మము నందు నాయికాశృంగారభావవిభావానుభవ ములకు సాధనములైన ప్రకృతిశృంగారవిలాస ములు వసంతమునందు నాయికాశృంగార విలాసములం దేకస్థాయియందు శృంగార రసోదయము గల్గించుచున్నవి. ప్రకృతి సౌందర్యవిలాసములు పురుషాధీనములయి శృంగారరసానందమనుభవముగాగల విధ మును ఋతుసంహారమునందలి భావదృశ్య ముల పరమార్థము బోధించుచున్నది. సౌంద ర్యవిలాసములు ప్రకృతిపురుషయోగము నందు సార్థకములై ఋతుసంహారమును రసానందమును గలుగుచున్నవి.

భావదృశ్యముల కల్పనలందు కాళిదాసుని ప్రతిభ సుప్రసిద్ధము. ఋతుధర్మముల కనురూపముగను ప్రకృతిశక్తిస్వరూపములకు విచిత్రరూపపరిణామముగను స్త్రీల వస్త్రాలంకారములును, కేశకలాపములును, పుష్పాలంకారములును, శృంగార చేష్టలును, కామకళావిలాసములును, కాళిదాసుకల్పనలందు చిత్రసౌందర్యవిలాసములను పొందుచు పరమానందమును గలుగజేయును. వివిధ ఋతువుల శృంగారభావచిత్రములు ప్రకృతి చిత్రపటములవలెను గంభీరములు, మనోహరములు. అందులకీ క్రిందిపద్యము లుదాహరణములు:

శ్లో. తారాగణప్రవరభూషణముద్వహన్తీ
మేఘావరోధపరిముక్తశశాంకవక్త్రా,
జ్యోత్స్నాదుకూలమమలం రజనీ దధానా
వృద్ధిం ప్రయాత్యనుదినం ప్రమదేవ బాలా.

గీ. చుక్కలగములను మేల్నగల్ చక్కఁదాల్చి
మబ్బుముసుఁగేదునెలమోము మలఁచి, పొలిచి,
వెన్నెలదుకూల మమలము వేసము నిడి
బాలవలె రాత్రి యనుదినవర్ధమాన.

శ్లో. ఆదీప్తవహ్ని సదృశైర్మరుతావధూతైః
సర్వత్ర కింశుకవనైః కుసుమావనమ్రైః,
సద్యో వసన్తసమయే హి సమాచితేయం
రక్తాంశుకా నవవధూరివ భాతి భూమిః.

గీ. స్ఫీతవహ్నిసమల్ మరుద్ధూతములును
ననల వంగిన కింశుకవనులు, కలయ
నెల్లెడలఁ గప్పు, నీభూమి యీవసంత
వేళ, రక్తాంశుక నవోఢ వోలెఁ గ్రాలు.

శ్లో. గురూణి వాసాంసి విహాయ తూర్ణం
తనూని లాక్షారసరఞ్జితాని,
సుగన్ధికాలాగురుధూపితాని
ధత్తే జనః కామమదాలసాఙ్గః.

గీ. గురుతరాంశుకములను వేగిరమ తొలఁచి,
యావకసురంజితములఁ జీనాంబరములఁ
బరిమళాసితాగురుధూపబంధురములఁ
దాల్తు్రి కామమదాలసతనులు జనులు

ఋతుసంహారానువాదకులు సుబ్రహ్మణ్యముగా రాంగ్లవిద్యావంతులైనను ప్రాచ్యసంస్కారాభిప్రియులు, మాతృభాషాభిమానులు. వారి సంస్కారభాషాభిమానములును సుప్రసిద్ధకావ్యాంధ్రానువాదమునందు సార్థకములు. కావ్యరచనయందు స్వతంత్రరచనలు సుకరములు, అనువాద

ములు దుష్కరములు. స్వతంత్రరచనలందు భావార్థానుసంధానము రచయితలకు సులభము. అనువాదములందు దేశకాలభావభాషాపరివర్తనములందు కావ్యహృదయ పరిజ్ఞానము,పూర్వాపరసందర్భముల యోచనలు దుస్తరములు. భావకావ్యములం దీప్రతిబంధకములు విశేషములు. వేంకటసుబ్రహ్మణ్యాముగా రీ ప్రతిబంధకముల నతిక్రమించి ఋతుసంహారమునకు చేసిన ఆంధ్రానువాదము ప్రథమప్రయత్నమైనను ఆంధ్రసాహిత్యమున కలంకారము. పద్యములు భావభాషాయోగమును గలిగి హృద్యములు. కొన్ని పద్యములు తేటతెనుగును, కొన్ని సంస్కృతప్రాయములును, కొన్ని సంస్కృతాంధ్రసమ్మిళితములునయి ఆంధ్రసాహిత్య హృదయమును పరిస్ఫుటము చేయుచున్నవిధమున కుదాహృతపద్యములు నిదర్శనములు. ఆంధ్రమహాజనులు కావ్యమునకు స్వాగతమొసగి కృతిని కృతికర్తను నాదరింతురు గాత!

శ్రీముఖ సం.
కార్తిక శు 3
సోమవారము

కా. నాగేశ్వరరావు.

---

# విజ్ఞప్తి

ఈ కావ్యమును నేను రచించుట రస ప్రలోభముననే గాని పాండితీకలనం గాదు. అతిమంజుల మగు మాతృక నాంధ్ర మునకుం బరివర్తించుట సాహసకృత్య మని యెఱింగియు, సహజచాపల్యము నరికట్టఁజాల నైతిని. ప్రతిభ చాలమి, ననుభవము లేమి మత్కృతిని దోషములుం బొరసియుండ వచ్చును. సహృదయులకు క్షంతవ్యుఁడ నని విజ్ఞప్తి.

తొలుత దీనికి సమగ్రమగు నుపోద్ఘాత మును వ్రాయ సంకల్పించితిని. కాని పరి శోధన కడుంగడు భారమగుటవలనను, తీఱిక లేమివలనను, నాప్రయత్నము నుజ్జగించి, సద్యస్సంకలితాధారము లొక కొన్నింటి నిబంధించుచు లఘుభూమికను రచించి ప్రకృత మునకు సంతృప్తిఁ జెందవలసినవాఁడ నైతిని.

మత్కృతి నామూలాగ్రముగఁ బరి శీలించి, సవరణల నచ్చటచట సూచించి,

అత్యంతము ప్రోత్సాహ మొసంగి, నా కృత జ్ఞతకుం బాత్రులైనవారు, 'భారతి' పత్రిక సహాయసంపాదకులు శ్రీమాన్ తిరుమల వేంకటరంగాచార్యులవారు. వారి కీకృతిముఖ మున ధన్యవాదము లర్పించుచున్నాను.

మఱియు,నాయం దపరిమితప్రీతి వహించి, మత్కృతి నవలోకించి, నిజహర్షముం దెలిపి, తొలిపలుకు రచించి, దీనికిఁ బ్రకటనభాగ్యముం గల్గఁజేసి నన్నుధన్యుం గావించిన దేశోద్ధారక, విశ్వదాత శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారికి నా కృతజ్ఞత నింతని చెప్పఁ జాలను. జగద్వంద్యులకు నా వందనములును సమర్పించుకొనుచున్నాఁడ.

గ్రంథనామమునను, గ్రంథగర్భమునం గూడ నుచితమనితోఁచునెడ విసంధిఁ బాటిం చితిని. సహృదయులు దీని నామోదింతు రనియే తలంచెదను.

శ్రీముఖ భాద్రపద శుక్ల చతుర్థి.

ఇట్లు:
బుధజనవిధేయుఁడు,
గుఱ్ఱం వేంకటసుబ్రహ్మణ్యము.

# ఉపోద్ఘాతము

---

౧. కర్తృత్వము :

'ఋతుసంహారము' కాళిదాసగ్రథిత మని లోకప్రసిద్ధి. ఇదానీంతనపండితు లొక్క కొందఱు తత్కర్తృత్వమును శంకించినను, ప్రాచ్య ప్రాశ్చాత్యప్రామాణికాభిప్రాయ మీకావ్యము కాళి దాసీయ మనియే గ్రహించియున్నది. కుమారసంభవ, రఘువంశ, మేఘసందేశమహాకావ్యత్రయమందు గోచ రించు ప్రౌఢిమ ప్రాయికముగా నిందుఁ గొఱవడియుం డుటంబట్టియు, మల్లినాథసూరి పైమూఁడింటికిని వ్యాఖ్య రచించియు దీని కటు సేయమింబట్టియు, భోజమమ్మటా దులు ఋతుసంహారమునుండి శ్లోకముల నుదాహరింపమిం బట్టియు కర్తృత్వసంశయ మేర్పడినది. ఏతన్నివారణ ముగాఁ బ్రాజ్ఞులొసంగిన సమాధానము :

ఈచిన్నకావ్యమునఁ గాళిదాసుని ప్రౌఢిమ కొఱ వడుట వాస్తవమేయయ్యు, నాతని వైలక్షణ్యము సుప్రత్యక్షము. శృంగారనిర్మగ్నత, ఉపమావిశిష్టత, శైలిసరళత, వృత్తిరుచిరత—యివన్నియు కాళిదాసుని కలరిన ట్లితరుల కలరియుండలేదు. ఆ ప్రత్యేకలక్షణ ములు ఋతుసంహారమునను స్ఫుటముగా నలరియున్నవి. బహుశః, మహాకవిప్రథమరచనము గావలయును.

మల్లినాథసూరి దీనికి వ్యాఖ్య వ్రాయమి కర్తృత్వమును శంకించి యనుటకుఁ బ్రమాణము లేదు. రచన మత్యంత సులభ మగుట, నా మహాపండితుఁ డేతద్వ్యాఖ్యానముం దలపెట్ట నవసరము లేకపోవచ్చును.

లక్షణకారులకుఁ బ్రౌఢకావ్యత్రయమునఁ గాళిదాసకవనోదాహరణములు పెల్లుగా నుండుటచే, వారి తొలిరచనము నుజ్జగించుట విపరీతము గాదు—అని.

ఈవిషయమున సిద్ధాంతీకరించుటకు రసజ్ఞజనానుభవమే ప్రమాణము. పాఠకులకుఁ గావ్యముననే మహాకవిమూర్తి స్ఫురించుచున్నది? ఈ మూర్తివిశేషము అనుకరణ దుర్లభం బని యెఱుంగునది. ఋతుసంహారముం జదువునపుడు యౌవనస్థుఁడగు కాళిదాసునిమూర్తియె ప్రస్ఫుటముగా గోచరించుచుండును. అంతియకాదు, వారి కావ్యత్రయమందలి వర్ణన లెన్నియే నిందు బీజప్రాయముగా నున్నవి. ఒకకొన్నింటి నుదాహరించెద—

(i) పుంస్కోకిల శ్చూతరసాసవేన
మత్తః ప్రియాం చుమ్బతి రాగహృష్టః,
కూజద్ద్విరేఫోఽప్యయ మంబుజస్థః
ప్రియం ప్రియాయాః ప్రకరోతి చాటు.

ఋ. సం. ౬సం. ౧౪.

దీనినే కుమారసంభవమున వెలార్చినవిధము వరయుఁడు:

మధు ద్విరేఫః కుసుమైకపాత్రే
పపౌ ప్రియాం స్వా మనువర్తమానః,

శృంగేణ సంస్పర్శనిమీలితాక్షీం
మృగీ మకణ్డూయత కృష్ణసారః.
దదౌ రసాత్పంకజరేణుగన్ధి
గజాయ గండూషజలం కరేణుః,
అర్ధోపభుక్తేన బిసేన జాయాం
సంభావయామాస రథాంగనామా.

తృ. స. ౩౬, ౩౭.

అదేవృత్తము, అదేసరణి!

(ii) ఆమూలతో విద్రుమరాగతామ్రం
సపల్లవాః పుష్పచయం దధానాః,
కుర్వన్త్యశోకా హృదయం సశోకం
నిరీక్ష్యమాణా నవయౌవనానామ్.

ఋ. సం. ౯సం. ౧౬.

అసూత సద్యః కుసుమాన్యశోక
స్స్కంధాత్ప్రభృత్యేవ సపల్లవాని,
పాదేన నాపైక్షత సుందరీణాం
సంపర్క మాశింజితనూపురేణ.

కు. సం. తృ. స. ౨౬.

మొదలంట నశోకములు విరులఁ దొడుగుట రెంటను నభివ్యక్తము.

(iii) తామ్రప్రవాళస్తబకావనమ్రా
శ్చూతద్రుమాః పుష్పితచారుశాఖాః,
కుర్వన్తి కామం పవనావధూతాః
పర్యుత్సుకం మానస మంగనానామ్.

మత్తద్విరేఫపరిచుమ్బితచారుపుష్పా
మందానిలాకులితనమ్రమృదుప్రవాళాః,
కుర్వన్తి కామిమనసాం సహసోత్సుకత్వం
చూతాభిరామకలికా స్సమవేక్ష్యమాణాః.
ఋ. సం. వసం. ౧౫, ౧౭.

ఈచూతతరువులు రఘువంశమునందును విశేషముగా మాఱలేదు :

అభినయాన్పరిచేతుమివోద్యతా
మలయమారుతకంపితపల్లవా,
అమదయత్ సహకారలతా మన
స్సకలికా కలికామజితామపి.

(iv) సుగన్ధినిశ్వాసవికమ్పితోత్పలం
మనోహరం కామరతిప్రబోధకమ్,
నిశాసు హృష్టాః సహ కామిభిః స్త్రియః
పిబన్తి మద్యం మదనీయ ముత్తమమ్.
ఋ. సం. శి. ౧౦.

ప్రియులతోఁగూడి సురాపానమును విలాసినులు శిశిరమందేకాక వసంతమందును పెల్లుగా సేవింతురు. ఆవిధమును రఘువంశమం దభివర్ణించుట నరయుఁడు :

లలితవిభ్రమబంధవిచక్షణం
సురభిగంధపరాజిత కేసరమ్,
పతిషు నిర్వివిశు ర్మధు మంగనాః
స్మరసఖం రసఖండనవర్జితమ్.
నవమసర్గ. శ్లో. ౩౬.

(v) కున్దైః సవిభ్రమవధూహసితావదాతై
రుద్యోతితా న్యుపవనాని మనోహరాణి,
చిత్తం మునేరపి హరన్తి నివృత్తరాగం
ప్రాగేవ రాగమలినాని మనాంసి యూనామ్.

బు. సం. వసం. శ్లో. ౨౩.

అమదయ న్మధుగంధసనాథయా
కిసలయాధరసంగతయా మనః,
కుసుమసంభృతయా నవమల్లికా
స్మితరుచా తరుచారువిలాసినీ.

ర. వం. నవమసర్గ. శ్లో. ౪౨.

కవి తొలిఁజెప్పిన యుపవనములనుండి యొక మల్లికను గ్రహించి రఘువంశశ్లోకమున నతి మనోహరముగాఁ బోషించినాఁడు. 'చిత్తం మునేరపి హరన్తి నివృత్త రాగం' అను పాదము వివక్షితరఘువంశశ్లోకమందలి 'కలికామజితామపి'ని జ్ఞప్తికిఁ దెచ్చుచున్నది.

(vi) "జలధరవినతానా మాశ్రయోస్మాకమ్ ముచ్చై
రయ మితి జలసేకై స్తోయదా స్తోయనమ్రాః,
అతిశయపరుషాభి ర్గ్రీష్మవహ్నేః శిఖాభిః
సముపజనితతాపం హ్లాదయన్తీవ విన్ధ్యమ్"

బు. సం. ద్వి. స. ౨౩.

త్వా మాసారప్రశమితవనో
పప్లవం సాధు మూర్ధ్నా
వక్ష్యత్యధ్వశ్రమపరిగతం
సానుమా నామ్రకూటః,

న క్షుద్రోపి ప్రథమ సుకృతా
పేక్షయా సంశ్రయాయ
ప్రాప్తే మిత్రే భవతి విముఖః
కింపున ర్య స్తథోచ్చైః.
పూ. మే. సం. ౧౭.

ఈ శ్లోకము లోకదానికొకటి యనుబంధముగానున్నవి. తొలిదాన, మబ్బులు తమకున్న తాశ్రయమను కృతజ్ఞత వలన, బర్వతునకు దావాగ్నిసంజనితసంతాపముఁ బాపినవి. మలిదాన, తనకు దావాగ్నితాపముఁ బాపినాఁడని పర్వతుఁడు కృతజ్ఞత వహించి, మేఘుని కాశ్రయమిచ్చి మూర్ధమం దెక్కించుకొనినాఁడు. మబ్బులు పర్వతశిఖరముల్రాలుట, వర్షించి కార్చిచ్చుఁ జల్లార్చుట యను కార్యములు రెంటను సమానము. రెంటను 'ఉచ్చైః' సాభిప్రాయముగాఁ బ్రయోగింపఁ బడినది. మేఘసందేశ శ్లోకమందలి విశేష సౌభాగ్యము నిట విస్తరింపనొల్లను.

కర్తృత్వముంగూర్చి యింకయు నొకమాట. ఋతుసంహారము కాళిదాసునిది కాదనుటవలన నా మహాకవికీర్తి హెచ్చును. ముఖ్యముగా గ్రీష్మఋతు వర్ణన మిందున్నంతమనోహరముగా కాళిదాసు అన్యత్ర రచింపలేదు. రఘువంశమునఁ బదునాఱవ సర్గ శ్లో. ౪౩ మొదలు ౫౩ వఱకు గ్రీష్మవర్ణనము గలదు. కాని ఋతుసంహార ప్రథమసర్గమందుఁ బ్రసక్తమైన యంశము లందు డిందువడినవి. దుర్భర దాహవర్ణనము, వైరిసత్త్వస్నేహవర్ణనము దావానల

వర్ణనము కాళిదాసుని యుత్తమభావన కుదాహరణ ముగాఁ గొనవచ్చును. కవితాకామిని ప్రాగల్భ్యమువలననే చిత్తము హరింపదు. మాగ్ధ్యమునను హృదయానుహారిణి యగుననుట కీ కావ్యము పరమ లక్ష్యము.

౨. కావ్యవస్తువు :

ప్రాచీనసారస్వతమునఁ గేవలము ఋతువర్ణనమున కుద్దేశింపఁబడిన కావ్య మిది యొక్కటియే యని చెప్పవచ్చును. ఒకానొక నాయకుఁడు తనప్రియురాలికి వరుసగా షడృతువుల నభివర్ణించినట్లు సంవిధానము. కాని ప్రత్యంశమును నాయికకుఁ జూపి వర్ణించినట్లు లేదు. అవలోక్యవిషయములు, ఊహ్యవిషయములును మిళితములై యున్నవి. ఈ నాయికానాయకసన్నివేశము చాల సమంజసమైనది. వర్ణనము, ముఖ్యముగా ప్రకృతివర్ణనము త్రాడులేని బొంగరమువలెఁగాక, హృదయావస్థ ననుకరించుట రసావిర్భూతి కవసరము. ప్రకృతి యథార్థత మానవానుభూతి ననుసరించియున్న దని తత్త్వజ్ఞులు వాకొందురు. ఆయనుభూతి కవియందుఁ గేవల మారోప్యమాణమగుటకన్న నొకానొక శృంగార మిథునమం దనురూపావిర్భావ మొందుట రసవత్తరము.

కాళిదాసు చిత్రించిన ప్రకృతి యువతీయువకుల కొక క్రీడారంగము. ఋతూత్పాదనము వీరి కలంకారము నాహ్లాదము నొసంగుటనే ప్రయోజనముగాఁ గల్గినట్లున్నది. గ్రీష్మవర్ణనమునఁ గొంతభాగముదక్క, మిగిలిన కావ్యమంతయుఁ గామప్రకాశనమున మించియున్నది. గ్రీష్మమున సైతము తొలిశ్లోకమున "దినాం

తరమ్యోభ్యుపశాంత మన్మథో” యని కాముని నిరుత్సాహపఱచియు, వెంటనే మూఁడవశ్లోకమున—

'సువాసితం హర్మ్యతలం మనోహరం
ప్రియాముఖోచ్ఛ్వాసవికంపితం మధు,
సుతంత్రిగీతం మదనస్యదీపనం
శుచౌ నిశీథేనుభవంతి కామినః'

యని కామోద్దీపన సామగ్రిని సేకరించి మఱి యాధోరణినే శృంగారలాలసను దీర్చుకొనక మానలేదు. ౮-వ శ్లోకమున నదిపనిగా మన్మథునిఁ గ్రీష్మమందు మేల్కొల్పి కోల్కొనఁ జేసినాఁడు. హేమంత శిశిర వర్ణనములందుఁ బ్రకృతివర్ణనము చాలవఱకు డిందువడినది. కామినీవర్ణన మెంతేని మెండుకొనినది. బహుశః కాళిదాసు లేవయసున వ్రాయుటవలనఁ బూర్ణప్రకృతి వర్ణనమునకుఁ బాటవము చాలమిచేతనో, శృంగారాభిలాష యనివార్యము, నపరిమితమునగుటచేతనో, కావ్యమిట్టి పరిణామము నందియుండవచ్చును.

ఈ విషయమై శ్రీ అరవిందఘోషుగారి వాక్యము లుద్ధరించుటవలనఁ దత్త్వము తేటపడఁగలదు.

“కావ్యము ఆఱుసర్గలు. వరుసగా గ్రీష్మము, వర్షము, శరత్తు, హేమంతము, శిశిరము, వసంతము వర్ణింపఁబడినవి. కావ్యారంభ మప్రతిమానముగానున్నది. నూత్నయౌవనమునను, ప్రతిభాబలమునను ఉత్సాహము వెల్లివిరియుచు, కవితాసామ్రాజ్యమును బల్మిమై సాధించువాఁడువోలెఁ గవి చూపట్టుచున్నాఁడు. మొదటమొదట

వతనిరచన ముత్సాహమునకు దీటుగానున్నది. వస్తుపరివీక్షణము, భావనాశక్తియు నుత్కటముగా నున్నవి. పదములకూర్పు, బిగువు, నడక కాళిదాసుని విశిష్టశైలికిఁ బ్రథమోదాహరణము. శ్లోకములభావబలము, శబ్దౌచితి, ప్రయోగప్రౌఢిమ సంస్కృతకావ్యరీతికిఁ బ్రథమపరిచయము. కవి తన సారమంతయు ప్రథమోత్సాహముననే వ్యయమొనర్చి, శిష్టకావ్యమునకు వలయు సామగ్రిని మిగుల్చుకొననట్లు తోఁచును. సారశిథిలత వెంటనే మన కతృప్తి గల్గింపదు. వర్షావర్ణనమున సుందరచిత్రముల నెన్నింటినో కవి సృష్టించి మనకు దృష్టిగోచర మొనర్చినాఁడు. భావనాపటిమ యొకింత తగ్గినది కాని పదగుంభన మించుక మెఱుఁగువాఱినది. శరద్వర్ణనమునఁ బటిమ తగ్గుట బాగుగ వ్యక్తమగును. కాని యిచ్చటను శైలిసొంపు, చిత్రముల యింపు ప్రియమొసంగించుచున్నవి. కవి మెల్లగాఁ దేరుకొని, నిష్కళంకలావణ్యసృష్టిగావింపఁగలఁడని మన కాశ పొడసూపును. ఆవెనకనే ఆశాభంగము. పిదప రెండు సర్గలందును కాళిదాసు కావ్యవస్తువుపైఁ బట్టు వదలినాఁడు. ప్రకృతివర్ణనము మూలపడును. అటనటఁ దత్ప్రసక్తియున్నది. కాని సంప్రదాయమాత్రము. అతనిపూర్ణప్రతిభ కామినీసృష్టియందు మగ్నమైనది. ఈ స్త్రీచిత్రములు అపూర్వములు. పదములతోఁ గాక రంగులతో నిర్మించినంత స్ఫుటముగా గోచరములగుచున్నవి. స్త్రీలావణ్యము కామపాశమునఁబట్టి గాళిదాసు నపసరిల్లఁజేసినది. ప్రకృతివర్ణనయు స్త్రీవర్ణనయు పూర్తిగా మేళవించుట

లేదు. ప్రక్క ప్రక్కన సైత మిముడవు. హేమంత మునఁ బొలములు, లతలు, జలాశయములు హిమాచ్ఛన్నములై చూపట్టువిధము మూఁడునాలుగు శ్లోకములందు వర్ణిత మైనది. ఇవి యింపుగా లేకపోలేదు. కాని ఆ పరివీక్షణము, ఆ ఉత్సాహము, ఆపటిమ తగ్గిపోయినవి. శిశిరమునఁ బ్రాగుద్దేశ్యము మఱింత సన్నగిల్లినది. అశిక్షితమగు యౌవనమున నపరిమితోత్సాహబలముగల కవిహృదయమున కీరెండు ఋతువులందును దేదీప్యమానములగు ప్రకృతి చిత్రములవలోక్యములు గాకపోవచ్చును. కాని వసంతము ఋతురాజము. ఈ ఋతువున సకలమును కాళిదాసుని కత్యంతము ప్రియమైనది. చరమసర్గము కావ్యమునకెల్ల మేలుబంతియై యుండవలసినది. కాని పూర్వాపరాధము కవిని విడనాడదు. తొలిపాటవము నుద్ధరించుటకుఁ గవి ప్రయత్నించుచున్నట్లు తప్పక స్ఫురించును. కాని ప్రయత్నము కాలుజాఱుచునే యుండును. పదములు మనోహరముగ దొరలుచునే యున్నవి. భాషాసౌధమున లోపము గాన్పింపదు. కాని జీవము సన్నగిల్లినది. కవిపరివీక్షణము మందమైనది. చివర చాల శిథిలమైనది. కావ్యాంత శ్లోకముతోఁ దృప్తిఁగనక గావలయుఁ గాళిదాసు పాఠాంతరముగా నొక శార్దూలవృత్తమునుగూడ వ్రాసినాఁడు. కాని రెండును చాలి లేవు. కావ్యమునకెల్లనెల్లగానుండవలసిన వసంతవర్ణన మన్నిటికన్నఁ దీసికట్టుగా నున్నది."

కావ్యవస్తువును మొత్తముగాఁ బరీక్షించినచో, శ్రీ అరవిందఘోషుగారి సిద్ధాంతము సత్యమారము

కాదని తెలియఁ గలదు. కాని షష్ఠసర్గముంగూర్చి వారంత నిరుత్సాహముగాఁ బల్కియుండ నవసరము లేదని మదభిప్రాయము. స్త్రీవర్ణన మీ సర్గములోఁ హేమంతశిశిరభాగములకన్నఁ గొండికగా నుండుట వాస్తవమేకాని ప్రకృతివర్ణనమునఁ గాళిదాసుని సహజ ప్రతిభ వసంతమునను చక్కఁగనే రాణించినది. ముఖ్యముగా ౧,౨,౧౬,౧౯,౨౦,౨౨ శ్లోకములు కావ్యమునం దేభాగమునకుఁ దీసిపోవు. స్త్రీవర్ణనమునను, ఈ క్రింది శ్లోకము నిసర్గరమణీయముగా నున్నది:

"నేత్రేషు లోలో మదిరాలసేషు
గండేషు పాండుః కఠినః స్తనేషు,
మధ్యేషు నిమ్నో జఘనేషు పీనః
స్త్రీణా మనఙ్గో బహుధా స్థితోద్య."

కాళిదాసు కావ్యమును వసంతముతో నారంభింపక గ్రీష్మముతో నేలదొరకొనెనని పలువురు ప్రశ్నించిరి. దీనికి సమాధాన మిదమిత్థమని నిశ్చయించుట కష్టతరము. రసవత్తమమని వసంతమునుగడ కొత్తియుండవచ్చునని, కీతుపండితులు సూచించినారు. నిజముగా వసంతవర్ణనము రసవత్తమముగాదని గదా అరవిందఘోషుగారు సిద్ధాంతీకరించిరి. కాళిదాసు గ్రీష్మముతోనే కావ్యారంభము చేసెననియు, వసంతమును కడకొత్తుట యితరులపనిగాదనియు నందఱి తలంపు. బహుశః కాళిదాసు గ్రీష్మకాలమునఁ గావ్యమువ్రాయ నుద్యమించి, అప్పు డనుభూతమగుచున్న ఋతువునే వర్ణింపదొరకొని, యాక్రమమునే

సాగించియుండునా? గుణముంబట్టియు గ్రీష్మవర్ణనము మొదటిదగుట, దానినట్లేయుంచి క్రమమును మార్పఁడాయెనా? ప్రాజ్ఞులు యోజింతురుగాక.

3. కవనప్రశస్తి:

"సాకూతమధురకోమల
    విలాసినీకంఠకూజిత ప్రాయే,
శిక్షాసమయేపి ముదే
    రతలీలా కాళిదాసోక్తిః."

అని గదా రసజ్ఞులు కవికులగురువువాక్కును మెచ్చుకొనిరి. కాని కాళిదాసు ఋతుసంహారము రచించునప్పటికి కవితా సామ్రాజ్యమునకుఁ బట్టాభిషిక్తుఁడు గాలేదు. యౌవనమునకు నిసర్గమైన దోషములు కొన్ని కావ్యముం బొరసియున్నవి. శైలియు రఘువంశకుమారసంభవములందుంబలెఁ బరిపక్వతం గనలేదు. దీనికిఁ దార్కాణగా రఘువంశము ౯-వ సర్గమందలి వసంతవర్ణనమును ఋ. సం. షష్ఠసర్గములోఁ బోల్చి పఠించునది. తొలిదానఁ గల సూక్తివైచిత్రి, అనుప్రాసము, ధ్వని, రసస్ఫురణయు నిందుఁ గొఱవడియున్నవి. చూడుఁడు:

"కుసుమమేవ న కేవల మార్తవం
నవ మశోకతరోః స్మరదీపనమ్,
కిసలయ ప్రసవోపి విలాసినామ్
మదయితా దయితాశ్రవణార్పితః.

"విరచితామధునోపవన శ్రియా
మభినవా ఇవ పత్రవిశేషకాః,
మధులిహాం మధుదానవిశారదాః
కురవకా రవకారణతాం యయుః.

"సువదనావదనాసవ సంభృత
స్తదనువాదిగుణః కుసుమోద్గమః,
మధుకరై రకరోన్మధులోలుపై
ర్బకుల మాకుల మాయతపంక్తిభిః."
ర. వం. నవమసర్గ. ౩౧, ౩౨, ౩౩.

'ఋతుసంహార ము'న సంవిధాన మసమగ్రముగను, రచన మసమముగను, భావన అపక్వముగను నున్నదని చెప్పుట కాళిదాసునెడ నపరాధముసేయుట గాదు. తన్నుమించినది తానే యగుట వలన నాతని కీర్తిచంద్రికను గళంకమంటదు.

అట్లయ్యును, ఋతుసంహారము దీప్తివంతమైన కావ్యమని గ్రహింపవలయును. షడృతువులును మన కనులకుఁ గట్టినట్లున్నవి. వనములు, నదులు, పర్వతములు, హర్మ్యములే గాదు, ఋతులక్ష్మియే ప్రత్యక్షమగుచున్నది. ఇదేశరత్తు—

"వికచకమలవక్త్రా ఫుల్లనీలోత్పలాక్షీ
వికసితనవకాశశ్వేతవాసో వసానా,
కుముదరుచిరకాంతిః కామినీవోన్మదేయం
ప్రతిదిశతు శరద్వశ్చేతసః ప్రీతి మగ్ర్యామ్."

ప్రతివర్ణనయు నొక్కొక్క చిత్తరువువలె నెల కొనియున్నది. అంతేగాక మానవహృదయము మానవే తరవస్తువుల నత్యంత మావహించియున్నది. హేమంత మునఁ బ్రియంగులతికవిధము నవలోకింపుఁడు—

“పాకం వ్రజన్తీ హిమజాతశీతై
రాధూయమానా సతతం మరుద్భిః,
ప్రియే ప్రియంగుః ప్రియవిప్రయుక్తా
విపాండుతాం యాతి విలాసినీవ.”

‘ఉపమా కాళిదాసస్య’ అను లోకోక్తిని సార్థకపఱచు సాదృశ్యములెన్నియే నీకావ్యమునఁగలవు. ఘనాగమమును దిగ్విజయసన్నద్ధుండగు రాజుతోను, కాఱుమబ్బులను నూరిన కాటుకప్రోవుతోను, తృణాంకురములను భిన్నవైడూర్యములతోను, పూర్ణవాహినులను దుష్టాంగనలతోను, మల్లెలను నవవధూహాసితములతోను, శారదరాత్రిని దినదినప్రవర్ధమానయగు బాలతోను బోల్చుట నరయుఁడు. ఈయుపమానము లెల్ల విశిష్టములు, సమగ్రములు. ఇతరకవుల కెందఱికే నొరవడి యైనవి. కాని ఉపమల పుక్కులత తరువాతి కావ్యములం దింకను ప్రసిద్ధిం బొరసినది. తత్ప్రశంసకుం దొరకొనుట గ్రంథముఁ బెంచుటయగును గావున నింతటితో విరమించెద.

గు. వేం. సు.

---

# అంకితము

---

కన్ను ఱెప్పలు బలె నన్నుఁ గాచుచుండు
భ్రాతృ శేఖరుఁడు, సధర్మవర్తనుండు
సంస్కృతాంధ్రాంగ్లవాణీప్రసాదజుషుఁడు
సుబ్బరామార్యుఁ డలర నీకబ్బ మిత్తు.

---

## ప్ర స్తా వ న

కాళిదాసుని కవనము బాళిఁ గొలుపఁ
బ్రకృతిసిద్ధచాపల్యము పలుకు గలుప
నాంధ్రమునఁ దీర్చితి ఋతుసంహారకృతిని;
బ్రాజ్ఞుల కృపావలోకనఁ బడయుఁగాత.

## య తి స్మృ తి

ఆశ్రమవిభక్తిపరిలంఘనాంతరుండు
ఆశ్రమాంతరవాసి, యోగానుభాసి
ప్రశ్రయార్థుల శిష్యుల పట్టుగొమ్మ
రమణఋషి నాకు సంతతరక్ష యగుత.

## గు రు స్మృ తి

పారమెఱుఁగని పాండితిఁ బ్రథితబుధుని
సాటిగల్లని సరసోక్తి మేటికవిని
మద్గురుని సంస్మరించెద మహితభక్తి
రాజమురుకీర్తి వేంకటరాయశాస్త్రి.

---

# ఆంధ్ర ఋతుసంహారము

## ప్రథమ సర్గము

---

చండభానువు, స్పృహణీయ చంద్రమనము
సంతతస్నానయోగ్యాంబుసంచయమ్ము
మంజుదివసాంత, మతిశాంతమన్మథమ్ము
వచ్చెను నిదాఘకాలమ్ము, వనిత కనుమ. ౧

చంద్రుఁ డడఁచిన చీఁకట్ల చాళ్ల నిశలు
మహితచిత్రము జలయంత్రమందిరమ్ము
సకలమణులును, సరసమ్ము చందనమ్ము
శుచిని జనులకు సేవ్యమా, శోభనాంగి. ౨

సౌరభాఢ్యము రమ్యము సౌధతలము
సురయు దయితాననోచ్ఛ్వాససుచలితమ్ము
కామసందీపనము తంత్రికారవమ్ము
శుచిని నడిరేయిఁ గాముకుల్ చూఱఁగొంద్రు.

పిఱుదుల దుకూలమేఖలావిహితములను
స్తనముల సహారభూషణచందనములఁ
గురుల స్నానకషాయితపరిమళములఁ
గాంత లుడిగింత్రు వెట్టను గాముకులకు. ౪

ప్రచురయావకరసరాగరంజితముల
నూపురారావమ్ముల నితంబినీపదాల
నడుగడుగునను హంసరుతానుకృతుల
మన్మథాధ్యంబ యగు జనమానసంబు. ౫

తరుణి, హిమగౌరహారశేఖరములైన
చనులు, చందనపంకవిచర్చితములు,
స్వర్ణకాంచీకలాపాత్త జఘనతలులు,
సోత్సుకము సేయవెవ్వాని యుల్ల మిపుడు? ౬

అంగసంధులఁ జెమ్మట యధిక మగుట
లావుచీరలఁ ద్యజియించి, లలన లిపుడు
సన్నవలువల ధరియింత్రు స్తనతటముల
నున్నతస్తనలు సయౌవనోన్మదనలు. ౭

వాయుల సచందనోదకవ్యజనజముల
హారిపీవరకుచమండలార్పణముల
వల్లకీకాకలీగీతవద్రవముల
స్మరుఁడు సుప్తుఁడుబలె బోధ్యమానుఁ డిపుడు.

నిశల సితహర్మ్యముల హాయి నిద్రవోవు
సతులమోములమఱిమఱి శశి చిరమ్ము
సోత్సుకంబుగఁ దిలకించి, యుడుగరాత్రి,
సిగ్గునంబలెఁ బాండిమఁ జెందుఁ జూవె. ౯

దుస్సహానిలోద్ధతభూరిధూళియుక్త
ఖరకరాతపతాపితగాత్ర మహిని
జూడనేని ప్రవాసులు చూడఁజాల
రంగనావిరహాగ్నిదగ్ధాత్ము లిపుడు. ౧౦

వెక్కసపుటెండలో డస్సి మిక్కుటముగ
దాడ లెండఁగ నెంతయు దప్పివలన
హరిణములు సూచి భిన్నాంజనాభనభముఁ
బరువులెత్తెడు జలమని వనములందు. ౧౧

విభ్రమముల సస్మితజిహ్మవీక్షణములఁ
బ్రోషితుల మానసమున బిబ్బోకవతులు
మదనసందీపనమ్ముఁ జేసెదరు వేగ
చంద్రభూషామనోజ్ఞదోషములువోలె. ౧౨

సూర్యకాంతకు మిక్కిలి సొక్కి చిక్కి
కాలుదుమ్మునఁ బథమునఁ గాల్పఁ బడుచు
వంచి తల, మాటి కూర్చుచు, వక్రగతిని
ఫణి మయూరతలమ్మున మణఁగు నిపుడు. ౧౩

దప్పి పైకొన, విక్రమోద్యమము తూల,
మాటి కూర్చుచు, నోరున్న పాటి దెఱచి,
జూలు విదలించుకొనుచు, విలోలజిహ్వ
చెంతఁ గరులున్నఁ గేసరి చీల్పఁ బోదు. ౧౪

చండభానుకరమ్ములఁ జాల డస్సి
కొలఁదిజలముల నెండిన గొంతుఁ దడిపి
దప్పి మితిమీఱి వేఁచ, నుదకము సరయు
కరులు భయపడవౌర సింగములకైన. ౧౫

భానుకిరణమ్ముల హుతాగ్నిభాస్వరముల
వాడ దేహాంతరమ్ములు, బర్హిణములు
బర్హముల మోము గ్రుచ్చిన ఫణుల నిపుడు
పట్టి చంపవు నికటానువర్తనముల. ౧౬

పొడవులో ముక్కుముట్టెల నడవిపంది
లెండుబురదలు దుబ్బులు దండిమైన
పడియఁ ద్రవ్వుచు, నెండకుఁ బాటుఁదప్పి,
భూతలమ్ముఁ బ్రవేశింపఁబోలు నిపుడు. ౧౭

తీక్ష్ణతరకిరణోజ్జ్వలద్దినకరుండు
చాల వేఁచుట, బురదలో సరసునుండి
గంతులిడి వచ్చి కూర్చొనుఁ గప్ప తృషిత
ఫణిఫణాతపవారణప్రశ్రయమున. ౧౮

ఉద్ధృతాశేషతామరసోత్కరమ్ము,
ప్రహతమీనమ్ము, ద్రుతభీతవాఃఖగమ్ము,
మడుగు, సాంద్రమర్దితకర్దమమ్మునయ్యె
గజము లొండొంటి నొరసి తాఁకంగ నిపుడు.

రవికరోద్భిన్ననిజశిరోరత్నకాంతి
ప్రచలజిహ్వాద్వయవిలీఢవాతయుక్త
అనలవిషభాస్కరాతపప్రాప్తతాప
సప్పము తృషార్త చంపదు కప్పగముల. ౨౦

నురుఁగు కాఱఁగఁ, బొడవైన నోరు కదల,
నలఁతిమెఱుఁపగు నాలుక వెలువడంగ,
దప్పిగొని, మోర నెత్తి, కన్నట జలము,
కొండగుహ వీడు గేదెలగుంపు, చూడు. ౨౧

స్ఫురదురుదవదాహోచ్ఛుష్క సస్యాంకురమ్ముల్
పరుషపవనవేగోద్భ్రాంతసంశుష్కపర్ణల్
ఖరకరపరితాపక్షైణ్యతోయాశ్రయమ్ముల్
కరము భయము గొల్పన్ గాంచఁ బైనుండి
కానల్. ౨౨

శుష్కపర్ణద్రుమాళి నూర్చును ఖగాళి
కొండపాదఁ జేరు బడలిన కోఁతిమూఁక
గవయగణ మెల్లెడల నీటికై భ్రమించు
బావినీరెత్తు ఋజుశరభముల గములు. ౨౩

స్ఫుటకుసుంభాచ్ఛసిందూరశోభ గలిగి
వేగిరము పుట్ట సుడిగాలి విసరుచేతఁ
దటతరులతాగ్రసంశ్లేషి దాహకుండు
తగులఁబెట్టుఁ బ్రదేశముల్ దశదిశలను. ౨౪

మండు, గాలికి మెండయి కొండదరుల;
విరియుఁ, బెటపెట యెండిన వెదురుపొదల;
నల్లు, ఝణిలోనఁ బెరిఁగి తృణాంతరములఁ;
గ్రాఁచు, దావాగ్ని, ప్రక్కలఁ బ్రాఁకి లేళ్ల.

బహుతరంబట్లు శాల్మలీవనులఁ బుట్టు;
మెఱయు, హేమమ్ముబలెఁ జెట్లబొఱియలందుఁ;
పండుటాకుల మ్రాఁకులఁ బట్టు నెగిరి;
పవనధూతాగ్ని వనపరిభ్రమణ సేయు. ౨౬

గజగవయసింహముల్, వహ్ని గ్రాఁచ మెయిని,
వైర మేదుచు మిత్రులభాతిఁ గూడి,
హుతవహాసక్తనగదరుల్ ద్రుతము వెడలి
వ్యాప్తసైకతనిమ్నగల్ వచ్చి చేరు. ౨౭

వారిజాతవనాచితాంబువు,
పాటలాంచితగంధముఁ
సారమజ్జనముఁ, సుసేవ్య శ
శాంక వైభవహారముఁ
హారి గ్రీష్మము కామినీయుత
మల్లనల్లన సాగుఁబో
చేర మేడల పృష్ఠసీమ ని
శిఁ మనోహరగాయనీ. ౨౮

---

# ఆంధ్ర ఋతుసంహారము

## ద్వితీయ సర్గము

---

సకణజలధరమత్తకుంజరముతోడఁ
దడిదురుపతాక, యుఱుము మర్దలముతోడఁ
గామిజనహారి, యుద్ధతకాంతి, వచ్చె
రాజువలె, వర్ష ఋతువిదె, రాజితాస్య. ౧

నల్లగలువల చాయ రాజిల్లు నొకటఁ;
బోలు నూరిన కాటుకప్రోవు నొకట;
గర్భిణీస్తనకాంతి నొక్కటఁ జెలంగుఁ;
గారుకొను మబ్బు లెల్లెడ గగనసీమ. ౨

చాతకములు పిపాసార్తి జలము వేఁడ
బహుళధారలఁ గురియుచు వర్ష మెలమి
జలభరాలంబనమ్ములు సాగు నల్లఁ
గర్ణపర్యస్వనమ్ములు కంధరములు. 3

అశనినిస్వనపటహమ్ము లంబుదమ్ము
లింద్రధనువుఁ దటిద్గుణం బిపుడు దాల్చి
బహుళధారాపతనతీక్ష్ణబాణతతులఁ
బ్రోషితులమది బాధించు ముమ్మరముగ. ౪

భిన్నవైడూర్యనిభతృణోద్భిజ్జములును,
ప్రోత్థితశిలీంధ్రదళము, లారుద్రపుర్వు
లెల్లెడలఁ గప్ప, భూమి, సితేతరముల
మణుల ధరియించిన శుభాంగిమాడ్కి వెలయు.

హారినినదోత్సవోత్సుక మనవరతము
విపులకీర్ణకలాపశోభితము తతము
సంభ్రమాశ్లేషచుంబనసంగతమ్ము
శిఖికులమ్మదె నృత్యముసేయు నిపుడు. ౬

దరుల తరువుల నన్నింటి నురలఁజేసి
కలుషజలముల, వృద్ధవేగముల, నదులు
విభ్రమోద్భూతలై పోవు వేగవేగ
జలనిధింగూర్చి, చెడిన స్త్రీజనములట్లు. ౭

మొలకలెత్తెడు పచ్చికమొత్తములను,
చిత్రనీలాల, మృగముఖోచ్ఛేదితముల,
నుద్గతకిసాలతరువుల నొప్పమీఱి
వైంధ్యవనములు హరియించుఁ బ్రజలమనసు.

కలువకన్నులు కరము చంచలము లొప్పఁ
గడుబెదరికొను లేళ్లకడలఁ గ్రాల
సైకతిని యౌవనస్థలి స్వాంతమునకు
సంబరమ్మును గల్గించు సరసిజాక్షి. ౯

మఱిమఱి సముద్ధురంబుగ నుఱుము మబ్బు
వలనఁ బెఱ్జీఁకటైన శర్వరులఁ గూడ
మెఱుపువెలుఁగున దారుల నెఱిఁగికొనుచు
నేగువా రభిసారికల్ రాగమతిని. ౧౦

పరపరా యంచు మ్రోయు నభ్రములు, మెఱుపు
లధికముత్కంఠ గొల్ప హృదంతరముల
దయితులను సొగసులఁ గూడఁ దల్పమందు
గట్టిగాఁ గౌఁగిలింతు రంగనలు, దయిత. ౧౧

కలువకన్నులు చిలికించు జలములందుఁ
దానమాడంగఁ గెమ్మోవి, దామలేప
నాభరణములఁ బాసి, నిరాశలైరి
ప్రమద, ప్రోషితభర్తృకల్ ప్రమద లిపుడు.

పాండురము కీటతృణరజఃస్ఫారకమ్ము
సర్పవద్వక్రగమనప్రసర్పితమ్ము
సభయభేకకులేక్షణసంభ్రమమ్ము
అరుగు నూత్నజలమ్ము నిమ్నాభిముఖము.

దళములెడలిన పువ్వులగు నళిని విడిచి
శ్రోత్రపేయస్వనుల్ దమిఁ జొక్కు తేంట్లు
పరమమూఢులు, నటియించు బర్హిణముల
బర్హముల, నవేందీవరభ్రాంతిఁ బడెడు. ౧౪

ఉఱుము నవమేఘముల విన్కి నొడ్చి మదము,
తడవతడవకు ఘీంకృతుల్ గడలుకొలుపు
వనకరుల గండములు, నవోత్పలసమమ్ము
లళిసమూహాఢ్యమదవారి నాచితములు. ౧౫

కైరవసితాంబుధరచుంబితోరుసాను,
లాంఛితప్రస్రవణనిస్వనాఢ్యములును
నృత్తసంలగ్నశిఖికులోద్వృత్తములును
భూధరము లుత్సుకత్వముఁ బొదలఁజేయు.

అర్జునకదంబకేతకీసర్జవనముఁ
గరము కదలించి, తత్సుమపరిమళములఁ
బొలసి, సకణాంబుధరసక్తిఁ జలువలొలసి,
డాయు వాయువు సోత్సుకు సేయ దెవని?

శ్రోణితటలంబనముల, శిరోరుహముల;
సుమముల, సుగంధిలావతంసముల; హార
కలితకుచముల; సీధుయుగ్వదనములను;
గలుగఁజేతురు రతిఁ గాముకులకు స్త్రీలు. ౧౮

విద్యుదింద్రధనుఃస్ఫీతవిలసితములు
జలభరాలంబనమ్ములు జలధరములు;
మేఖలామణికుండలోన్మేషితాంగ
న; లోకమొగిఁ బ్రోషితాంతరముల హరింత్రు.

కేసరకదంబకేతకీకృతసరాల
శిరముల ధరింతురిప్పుడు స్త్రీలు పేర్మిఁ;
గకుభగుచ్ఛము లిచ్ఛానుగతిని గ్రుచ్చి
పోలఁ జెవిసంది నవతంసముల ఘటింత్రు. ౨౦

అగురు మెదిపిన చందన మలఁదిన మెయి
అలరుచెవిసొమ్మువలన గంధిలెడు జడలు
గల సతులు సంజ వినినంత జలదరవము
గురుగృహాము వీడి, పడకటిల్ సొరుదు రెలమి.

ఉత్పలవిభాఢ్యజలగళదున్నతములు
మృదుపవనధూతములు, మందమృదులగతులు
అభ్రములు, సేంద్రచాపము లాఁచునుబలె
అధికవిరహార్తపథికాంగనాంతరముల. ౨౨

అలరు లలరు కదంబాళి హర్షిలుబలె;
ఆడుబలె వాతధూతశాఖాగతతుల;
మొగలిరేకుల నెల్లెడ నగునుబలెను;
నవజలనిషేకమునఁ దాపమవియ, వనము. ౨౩

సిగను క్రొంజాజిపూలతోఁ బొంగడదండఁ
గూర్చు సతులకు; యూథికాకుట్మలముల,
ఫుల్లనవనీపముల, గర్ణపూరములిడుఁ;
గాల మంబుదచయ మిది కాంతునట్లు. ౨౪

హారములు పీవరపయోధరాగ్రములను;
ఆయతశ్రోణులఁ దనుసితాంబరములు;
లలితవలిభంగయుతమధ్యతలుల, సతులు
దాల్తు, నవజలసేకోద్గతమ్ము నారు. ౨౫

నూతనాంబుకణోత్క్రాంతిశీతలమ్ము
లలితసుమభరనతవృక్షలాసకమ్ము
కేతకీబంధురరజోవికీర్ణగంధ
మనిలము హరించుఁ బథికజనాంతరముల. ౨౬

ఉన్నతాశ్రయ మితఁడు మా కుదకభరవి
నతుల కని, యంబుదము, లంబునమ్రము లివి,
పటుతరదవాగ్నితాపముఁ బాపి, జలని
షేకమున, వింధ్యు హ్లాదితుఁ జేయఁబోలు. ౨౭

సకలగుణశోభి, కామినీస్వాంతహారి,
నిర్వికారి, లతాతరునికటబంధు,
వంబుదాగమ మిది ప్రాణిప్రాణసమము
భవదభీష్టదమై యెప్డు వఱలుఁగాక. ౨౮

---

# ఆంధ్ర ఋతుసంహారము

## తృతీయ సర్గము

---

కాశవస్త్ర, ఫుల్లమనోజ్ఞకంజవక్త్రి,
ప్రోన్మదనహంసనాదనూపురనినాద,
పక్వసస్యావనతగాత్ర, భవ్యరూప,
క్రొత్తకోడలువోలె శరత్తు వచ్చె. ౧

తెల్లులగు భూమి, నిశలు జాబిల్లివలన,
హ్రదములగు గల్వల, సరిత్తు లంచగముల,
సుమభరానతసప్తచ్ఛదముల నడవు,
లుపవనుల్ మాలతులఁ, దెల్పు నొందె నిపుడు.

చంచదుత్సుకశఫరీరశనలు, నదులు,
నికటసంస్థితసితఖగనికరవళులు,
వ్యాప్తపులిననితంబబింబములు వోవు
మెల్ల మెల్లన సమదలు మెలతలట్లు. 3

రజతశంఖమృణాళగౌరములఁ, దృక్త
జలముల, లఘిమ శతధా ప్రచాలితములఁ
బవనవేగ ధూతముల, నభ్రముల, నభము
క్రాలు వరచామరావీజ్యరాజువోలె. ४

నభము భిన్నాంజనాధికనైల్యహారి,
ధరణి బంధూకసుమరాగవిరచితాంగి,
చారుపద్మావృతస్థలుల్ చఱియకడలు,
సోత్సుకము సేయ విప్ప డేయువకుమదిని ? ౫

గాలిఁ గొనకొమ్మ లలనల్లఁ గదలుచుండఁ,
బువులపుట్టుకఁ గిసలాగ్రములు రహింప,
సమదమధుపప్రపీత మాసవము కారఁ,
జించ దేయువమది నెట్టికాంచనమ్ము ? ౬

చుక్కగములను మేల్నగల్ చక్కఁదాల్చి
మబ్బుముసుఁగేదు నెలమోము మలఁచి,పొలిచి,
వెన్నెలదుకూల మమలము వేసము నిడి
బాలవలె రాత్రి యనుదినవర్ధమాన. ౭

## తృతీయసర్గము

తనరి కారండవాస్యఘాతమ్ము లలల,
నలరి కాదంబసారసవళుల దరుల,
రాగిలి సరోజసుమరజఃక్రాంతి, నదులు
హ్లాదమిడుఁ బ్రాంతజనులకు హంసరుతుల. ౮

కనులపండువు, శిశిరశీకరసువర్షి,
హృదయహారిమరీచిసంపద గలాఁడు,
హ్లాదకుం డిందుఁడు దహించు నతితరమ్ము
విరహవిషదిగ్ధశరహతప్రియులతనుల. ౯

కంకులన్ వ్రాలు వరుల మొక్కలఁ గదల్చుఁ
బువ్వుల వంగిన తరురాజముల విదల్చు
ఫుల్లకమలవనీనాళముల మెదల్చు
ననిల మూఁగించు యౌవతమనము బల్మి. ౧౦

మదకలసితాక్షదంపతిమండితమ్ము,
లచ్ఛములు, వికచాబ్జోత్పలాంచితములు,
ప్రాతరనిలోద్గతతరంగవళులు మదిని
బలిమి నుత్కంఠఁ గొల్పును కొలను లిపుడు.

బలభిదుధనుస్సు జలదగర్భముల మాసె
మింటిపెక్కెము విద్యుత్తు మెఱయ దిపుడు
బెగ్గురుల్ ఱెక్కల నభమ్ము వీవరావు
కనవు మొగమెత్తుక నెమళ్లు గగనపథము. ౧౨

ఆటమానిన శిఖుల ననంగుఁ డేది,
తియ్యఁబాడెడు హంసల నొయ్యఁ జేరు;
సర్జకుటజకదంబనీపార్జునముల
వదలి, సప్తచ్ఛదము లొందుఁ బ్రసవలక్ష్మి.

కలితశేఫాలికాసుమగంధిలములు
స్వస్థసుస్థితఖగకులప్రతిరవములు
నికటవిహారస్మృగేక్షణేందీవరములు
కరము తమిఁగొల్పు నుపవనుల్ పురుషమతుల.

అబ్జకల్హారకుముదము లధికమూఁచుఁ
దదనుషంగాభిశైత్యము తతము వొందు
దళశిఖాలగ్నహిమబిందుతతిఁ గదల్చుఁ
బ్రాతరనిలము వేడ్కఁ గరమ్ము సేయు. ౧౩

పుష్టశాలిచయావృతభూతలములు
సుస్థితస్వస్థగోకులశోభితములు
సారససితాంబకప్రతిశబ్దితములు
అఖిలజనహర్షదములు సీమాంతరములు. ౧౬

చెలువలమనోజ్ఞగమనము గెలిచె నంచ
లాస్యములశోభ గెలిచె ఫుల్లాంబుజములు,
గెలిచె మదకలేక్షుల నల్లగలువవిరులు
కన్బొమలసొంపు తనుతరంగములు గెల్చె. ౧౭

ఉవిదల విభూషణాశ్లిష్టబాహువుల కాంతి
సుమనతకిసప్రియంగులు చూఱగొనెడు;
దంతభాసాచ్ఛహాసవక్త్రప్రశోభఁ
గ్రొత్తజాజు లశోకపుష్పోత్తములును. ౧౮

ఘనవినీలవికుంచితాగ్రములఁ గురులఁ
జెరువుదురు క్రొత్తజాజులు తరుణసతులు;
మేల్మిబంగారుకమ్మలు మించు చెవుల
వివిధనీలోత్పలమ్ములఁ బెట్టికొంద్రు. ౧౯

చందనరసార్ద్రహారముల్ స్తనతటాల
మ్రోయుమొలనూళ్లు సువిపులశ్రోణితలుల
హారికలనూపురములు పాదాంబుజముల
లలనలు ప్రహృష్టచిత్త లలంకరింత్రు. ౨౦

వికచకుముదాఢ్యముల హంసవేష్టనముల
మరకతోద్యద్విభోదకమండితముల
కొలఁకుల విశేషశోభఁ జేకొను నభమ్ము
అపగతాభ్రమ్ము, చంద్రతారాచితమ్ము. ౨౧

కలువలంటి చల్లగ వీచు గాలు లిపుడు;
జలదబృందము లేది దిక్కులు రహించు;
విమల మంబువు; శ్యానపంకము ధరిత్రి;
అమలకరచంద్ర ముడుచిత్ర మంబరమ్ము. ౨౨

దినకరకరాళిఁ బ్రొద్దునఁ దేఱు చబ్జ
మిపుడు వరసతిముఖమట్టు లింపునింపు;
కుముదమో చంద్రబింబము క్రుంకుఁగనుట
నడఁగు విప్రోషితాంగనాహాసితమట్లు. ౨౩

చెలుల నీలాక్షులక్ష్మి నుత్పలములందు,
సమదహంసరుతుల రణత్స్వర్ణకాంచి,
బంధుజీవములం దోష్ఠవైభవమ్ము,
కాంచి, పథికులు భ్రమసి, రోదించువారు. ౨౮

లలనలముఖమ్ములం దిందులక్ష్మి, నిపుడు,
రాజహంసోక్తి మణినూపురమ్ములందు,
చిత్తహరదోష్ఠముల బంధుజీవకాంతి,
నిడుచు, సుభగ శరల్లక్ష్మి యెటకొ తరలు.

ఉత్స్ఫుటాబ్జాస్య, ఫుల్ల నీలోత్పలాక్షి,
వికచనవకాశసితవస్త్రవిహితదేహ,
కుముదరుచిరరుచి, శరత్తు, ప్రమదయట్లు
నించు మాచిత్తముల నెప్డు మించు ప్రీతి. ౨౯

---

# ఆంధ్ర ఋతుసంహారము

## చతుర్థ సర్గము

---

నవకిసోద్గమసస్యముల్ నవురు గొల్పె
లొద్దుగల్ పూచె, వరిపైరులును ఫలించెఁ,
బద్మము లడంగె, మఱి మంచు వట్టఁదొడఁగె,
వచ్చె హేమంతకాలము వచ్చె నిదిగొ. ౧

కుందహిమచంద్రసమముల, కుంకుమాక్త
రాగముల, రమ్యతరముల, రత్నవళుల
మండితముసేసెదరు స్తనమండలములు
లలన లున్నత స్తనలు విలాసవతులు. ౨

కనకరత్నవిచిత్రముల్ కాంచికలను
ప్రమదలు నితంబతటిఁ దాల్పఁ బాలువడరు
హంసరుతనందితమ్ముల నందెల నిపు
డంబుజోద్భాసి పదమండనంబుఁ గొనరు. 3

బాహుయుగముల నంగదవలయములు, ని
తంబతటముల నవదుకూలంబులు, ఘన
కుచముల్గ సన్నవలువలు, కూడుకొనవు
లలన, హిమవేళ యవుట, విలాసినులకు. ౪

ప్రాణిపసుపును మెయినిండ రాచికొంద్రు
మకరికలఁ దీరుతురు ముఖమండలమునఁ
నగురుధూపము శిరమునఁ దగ రచింత్రు
ప్రమద లిప్పుడు సురతోత్సవమ్ము కొఱకు. ౫

సురతసంక్లిన్నపాండురసుందరాస్య
లాఢ్యహర్షాభ్యుదయలు ప్రాయంపుసతులు
పీడ్యమానముల రదాగ్రభిన్నములను
అధరములఁ జూచి నగవొంద రతితరమ్ము. ౬

పీనకుచమండలమ్మున వేడ్కఁ జేరి
తత్ప్రపీడనజాతఖేదమ్ముఁవొంది
రాలు హిమబిందులఁ దృణాగ్రకీలితముల
వేగుతఱి సీతు విదె విలపింపఁబోలు. ౭

వరుల వెన్నులు పుట్టి వ్యాపకమునొంద
హరిణసతులసమూహముల్ మురువుసూపఁ
జారుచక్రనినాదముల్ జాలువాఱ
నలరఁజేసెడు మదిని సీమాంతరములు. ౮

నల్లగలువలు కడు వికసిల్లుచొప్ప,
సమదకలహంసలు విభూషణములుగాఁగ,
తేరిన సుశీతలంబైన నీరు గలుగ,
బురుషులమనస్సుల హరించు సరసు లిపుడు.

పండుచుఱ్ఱ మంచుచేఁ బుట్టు నిండుచలికి
మించి గాలులు నిరత మూఁగించుచుండ
విప్రయుక్తవిలాసిని విధము దోఁప
నధికపాండిమఁ జెందుఁ బ్రియంగులతిక. ౧౦

వదనములు పుష్పమద్యసంవాసితములు
గాత్రములు నిశ్వసనవాతగంధిలములు
అవయవములు పరస్పరవ్యత్యయములు
గాఁగ, రతివిద్ధము జనమ్ము గను సుషుప్తి. ౧౧

రదనసుతుతిలకమ్ములు పెదవికొసలు
గోటిగీరులతో నొప్పు కుచయుగములు
క్రొత్తవయసున నలరారు కొమ్మలొందు
నిర్దయరతోపభోగముఁ దెల్పుఁ జూవె. ౧౨

చేత నద్దమిడుకొని కై సేయు నొకతె
వదనకమలమ్ము బాలాతపమ్మునందు;
పెదవి విఱచుచు దశనాగ్రభిన్న మదిగొ
ప్రియతమనిపీతసారము వీక్షసేయు. ౧౩

కామసురతశ్రమాలసగాత్ర యొకతె
నక్తజాగరపాటలనయనపద్మ
కీర్ణభుజలులితాకులకేశపాశ
మృదుదివాకరకరతప్త నిదురసేయు. ౧౪

త్యక్తపరిమళనిర్మాల్యదామములను
తొలఁచి తలనుండి నీలాలకలు తరుణులు
తుంగఘనకుచభారానతాంగ లిపుడు
సేసెదరు కేశరచనమ్ముఁ, జెలియ, పరలు. ౧౫

కాంచి ప్రియపరిభుక్తము గాత్ర, మపర
హార్షపులకిత, రచితోష్ఠహారిశోభ,
లంబనీలాలకాకుంచితాంబకయుగ
రవికఁ దొడుగు, నఖక్షత రాజదంగి. ౧౬

చిరము రమియించు చలయుటఁ జేసి నొగిలి
ప్రశిథిలీకృతగాత్రలు ప్రమద, లబల
ఫుల్లపులకోరుకుచమండలోల్లసితలు
చారుశోభ, లభ్యంగము సల్పువారు. ౧౭

అధికగుణశోభి స్త్రీహృదయానుహారి
పక్వబహుసస్యవజ్జనపదతలమ్ము
సతతవేష్టనసుఖకరచక్రపంక్తి
మంచుకాలము మీకిది నించు ముదము. ౧౮

---

# ఆంధ్ర ఋతుసంహారము

## పంచమ సర్గము

---

రూఢశాల్యంశుచయహార్షరూఢమిదిగో
విరళచక్రనినాదసంవిరచితమ్ము
ఇతరకామమ్ము, ప్రమదాజనేష్టతరము
వినుము, కాలము శిశిరాఖ్యమును, వరోరు. ౧

సాభిరుద్ధగవాక్షగృహాంతరములు
భానుకిరణసమూహముల్, వహ్నిశిఖలు
గురుతరము లంశుకమ్ములు, తరుణసఖులు
జనుల కిప్పుడు సేవ్యమయ్యెను, వరాంగి. ౨

చంద్రకిరణాతిశిశిరమ్ము చందనమ్ము
హార్మ్యపృష్ఠమ్ము శరదైందవామలమ్ము
వాతములు సాంద్రహిమపాతశీతలములు
కావు జనచిత్తసంతోషకారు లిపుడు. 3

హిమసమూహనిపాతశైత్యములు, మఱియు
శశిమయూఖప్రసారణశైశిరములు
పాండుతారాసిచయజిహ్మామండితములు
చనవు రాత్రులు సేవ్యమై జనులకిపుడు. ౪

ఆఢ్యతాంబూలలేపనహారలగుచు
మద్యపరిమళితాస్యాబ్జమహితలగుచు
పరమకాలాగురుసుధూపవాసితములఁ
గేళిగృహములఁ జొత్తురు స్త్రీలు వేడ్క. ౫

సొగసులు పల్మఱును తర్జితాంగులయ్యు
నప్రకంపులు సాధ్వసాస్తమితమతులు
సురతపర్యుత్సుకులు నైన వరులఁ జూచి
మదవతులు వారితప్పుల మఱతురిపుడు. ౬

నిడుదనిశలను యువకులు నిర్దయముగ
నధికకాములు మఱిమఱి యభిరమింప
ఖేదితోరస్థలలు రాత్రి క్షీణమగుడు
నడతు రలనల్ల నవయౌవనస్థ లిపుడు. ౭

మంచిరవిక స్తనాల బిగించుకొనఁగ,
రక్తకౌశేయక మురాన రాజిలంగఁ
గురుల లెన్నఁగ సుమపాళి కూరుకొనఁగ
స్త్రీలు సీతువు నిష్ఠు కై సేయఁబోలు. ౮

సాంద్రకుంకుమరాగపింజరముల, నవ
యౌవనోష్మముల, సుఖసేవ్యములఁ, జనుల
నురమున విలాసినుల్ కరమ్మొరయుచుండఁ
గాముకుల్ చలి నెడఁద్రోచి కాంత్రు నిద్ర. ౯

వాసితశ్వాసకంపితోత్పలయుతమ్ము,
కామరతిబోధకమ్ము, హర్షామృతమ్ము,
శ్రేష్ఠమదనీయమద్యమ్ముఁ స్త్రీలు నిశలఁ
గ్రోలుచున్నారు ప్రియులను గూడి, ప్రియరో.

వేగుతఱి, నపగతమదరాగ, యోర్తు
దయితృసంశ్లేషనిబిడీకృత స్తనాగ్ర
కనుచు ప్రియపరిభుక్తము తనదు మెయిని,
పడకటిల్వీడి వేర్వీడు వడయు, నగుచు. ౧౧

అగురుధూపానువాసితమైనజడను
పూలదండల నెడలించి, ముడివయిచుచు,
వేగుతటి పీడుఁ బడకను వేఱుప్రమద
గౌరవనితంబ, తనుమధ్య, చారుశోభ. ౧౨

అపుడె కడిగిన కనకపద్మాననములు
శ్రవణతటసక్తపాటలచక్షువులును
అంసనంసక్తకేశము లలర, నుషను
లలన లున్నారు నట్టింట లక్ష్ములట్లు. ౧౩

శశ్వదానమ్రమధ్యలు, జఘనభరలు
స్తనభరాలస లలనల్లఁ జనెడు సతులు
వేగ సురతానుకృతనైశవేష మేది
వేషమూఁ దినయోగ్యము వేఱు దాల్త్రు. ౧౪

కనుచు నఖపదచితములఁ జనులకొనలఁ
దాఁకు చధరకిసాగ్రము దంతభిన్న
మీాయభీష్టరసమ్మున హాయిఁగనుచు
లలన లుదయాన ముఖము లలంకరింత్రు.౧౫

గుడవికారాఢ్య, శాలీక్షుకులమనోజ్ఞ,
ప్రబలరతికేళి, కందర్పబాధదర్ప
ప్రియజనవియుక్తచిత్తవిప్రియకరాత్మ
శిశిర మిది మీకు నిరతము శ్రీదమగుత. ౧౬

---

# ఆంధ్ర ఋతుసంహారము

## షష్ఠ సర్గము

---

వికసితరసాలకిసలయాభీలశరుఁడు
భ్రమరమాలాలసద్ధనుర్జ్యాయుతుండు
సురతసంసక్తచిత్తముల్ కరమగల్పఁ
బ్రియరో, వచ్చె వసంతాఖ్యవీరుఁ డిదిగో. ౧

తరువులు సపుష్పములు, సపద్మము జలమ్ము,
వనితలు సకామలు, సుగంధి పవన, మబల
సంజలు సుఖమ్ములు, పవళ్లు రంజకములు
చైత్రసంప్రాప్తి సర్వము చారుతరము. ౨

బావినీటికి, శశికిరణావళికిని,
రత్నకాంచీగుణములకుఁ, బ్రమదలకును,
విరులఁ దొడిగిన సహకారవృక్షతతికి
నిచ్చుచున్నాఁడు సౌభాగ్య మీ మధుండు. ౩

కుసుమపూవన్నె నొరయు దుకూలపాళి
హారిహేలావతీనితంబాంగణములు,
రక్తపటములఁ గుంకుమరాగగౌర
ముల నురోజాంగణము, లిప్డు భూషితములు.

కర్ణములఁ దగు నవకర్ణికారసుమము,
లోలనీలాలకలను కెంగేలితోడ
ఫుల్లనవమల్లికాపుష్ప ముల్లసిల్లు ;
కొమిరె లిప్పుడు కై సేసికొన్నయంత. ౫

క్రాలు సితచందనార్ద్రహారములు చనుల ;
నలరు బాహువులఁ వలయాంగదములు ;
కటితటమ్ముల రత్నమేఖలలు వెలయు ;
మదనపీడితమానసమదవతులకు. ౬

హైమపద్మాభముల, సపత్రాంకితముల,
మహిత హేలావతీముఖమండలములఁ
జారుతరమణిమౌక్తికసంగరమ్య,
మాధ్యతం గను స్వేదసమాగమమ్ము. ౭

సంశ్లథాఖిలబంధ, లుచ్ఛ్వాసయుక్త,
లసమబాణవిశేషాకులావయవలు,
మ్రోలఁ జరియించు ప్రియతమపురుషులందు
సోత్సుకాత్మలై యయ్యెద రువిద లిపుడు. ౮

కృశములౌ పాండువుల మాంద్యవశగతములఁ
దడవతడవకు జృంభణ తత్పరములఁ
జతురలావణ్యాసంసర్గసంభ్రమములఁ
జేయు నివ్వేళ నతనుఁడు స్త్రీల తనుల. ౯

అక్షులౌ జంచలుం డాసవాలసముల,
గండములఁ బాండురుండు, కర్కశుఁడు చనుల,
నడుములఁ గృశుండు, పిఱుదులఁ గడువిశాలుఁ,
డంగనలఁ బల్వగల నిష్ఠనంగుఁ డొప్పె. ౧౦

అవయవమ్ములు నిద్రాలసాతివిభ్ర
మములు, కించిన్మదాకర్షకములు నుడులు,
చెలిరో, చూపులు భ్రూక్షేపజిహ్మములును
గాఁగఁ బ్రమదల కొనరించెఁ గాముఁ డిపుడు.

కుంకుమశ్యామకాలీయకుసుమములను
కస్తురిం గూర్చి మెదిపిన గంధమిప్పు
డలఁదుచున్నారు గౌర స్తనాంగణముల
లలనలు, విలాసినుల్, మదాలసలు, ప్రమద.

గురుతరాంశుకములను వేగిరమ తొలఁచి,
యావకసురంజితములఁ జీనాంబరములఁ
బరిమళాసితాగురుధూపబంధురములఁ
దాల్తు రి కామమదాలసతనులు జనులు. ౧౩

చూతరసమద్యమత్తపుంస్కోకిలమ్ము
రాగహృష్టమ్ము చుంబించుఁ బ్రాణసతిని;
పద్మవసతిని శబ్దించు భ్రమరపతియు
ప్రియసతికి నర్మకృత్యముఁ బ్రియముఁ జేయు.

శ్యామకిసలయమంజరీనమ్రతరులు
మంజుపుష్పితశాఖ లామ్రములు గనుమ
సారమలయసమీరసంచాలితములు
సేయు నౌత్సుక్యమెంతయు స్త్రీలమదిని. ౧౪

తాల్చి మొదలంట విద్రుమతామ్రములను
సూనపంక్తులను, కిసాలశోభితము, ల
శోకము లొనర్చు సశోకములుగ
నెదుటఁ గన్పట్టు నవయువహృదయములను.

సమదమధుకరచుంబితచారుసుమలు
మందపవనాకులితనమ్రమంజుకిసలు
కామిమది నుత్సుకత బల్మిఁ గలుగఁజేయుఁ
జూతరమణీయకళికలు చూచునపుడు. ౧౨

కాంతముఖకాంతి గగ్గి యుద్గతములైన
యెఱ్ఱగోరింటగుత్తుల యింపు పెంపు
గనియు, కందర్పునలుగులగములవలన
నెవని సహృదయుని మనసు హింసపడదు?

స్ఫీతవహ్నిసమల్ మరుద్ధూతములును
ననల వంగిన కింశుకవనులు, కలయ
నెల్లెడలఁ గప్ప, నీభూమి; యీవసంత
వేళ, రక్తాంశుక నవోఢ వోలెఁ గ్రాలు. ౧౪

చిల్కముఖకాంతి మోదుగల్ చీల్పలేదె?
కర్ణికారసుమమ్ములు కాల్పలేదె?
సువదనానిహితమ్మును యువలమదిని
వెండి వేధించు మధురోక్తిఁ బికమిదేమి? ౨౦

మోదసముపాత్తకలరవపురుషపికము
లున్మదకలస్వనభ్రమరోత్కరములు
సిగ్గు తగ్గొప్ప కోడండ్రచిత్తమునకుఁ
గులగృహానను తుణిని వ్యాకులతఁ గొల్పు.

కుసుమితరసాలశాఖలఁ గొలిపి వణఁకు
పికరవమ్ముల దెసలందు విస్తరించి
నరులమతుల హరించుచు ననలవేళ
సరసుఁ డనిలుఁడు హిమపాతవిరతి వీచు. ౨౨

మల్లెల, సవిభ్రమాంగనామందహాస
సితముల, వెలుంగు నుపవనుల్ శ్రీకరములు
లోఁగొను నివృత్తరాగమ్ము యోగిమదినె,
ఊడ్చు రాగావిలము ముందె యువలమదిని.

వ్రేల మొలనూళ్లు, హారముల్ గ్రాలఁ జనులఁ,
గామదర్పాతిశైథిల్యగాత్రలగుచు
స్వాదుపికభృంగరవములఁ జైత్రవేళఁ
బ్రసభముగఁగొంద్రు నరులమానసముసతులు.

అఖిలచారుసుమాగవదంతరములు
హృష్టపరపుష్టరవసమాకృష్టసాను,
లవనిభృత్తులు ధాతుజాలావృతోప
లావళుల్ గని హర్షింతు రఖిలజనులు. ౧౫

కనులమూయును,రుదియించుఁ,గాంచు వెతను
ఘ్రాణమద్దుఁ గరాన, బిగ్గరగ నఱచు,
తన్వి నెడసి తపించు చిత్తమ్ముతోడఁ
జూచి పాంథుఁడు కుసుమితచూతతరుల. ౧౬

సమదమధుకరకలకంఠసమితి రుతుల
సుమయుతరసాలకర్ణికారముల, వాడి
యిషువులంబలె, మానినీహృదయహింస
సేయు, మధువేళ, మన్మథస్ఫీతి సేయు. ౧౭

మామిడిపూలగుత్తి వర
మార్గణముల్, ధనువుల్ బలాశముల్,
జ్యా మధుపాళి, నిర్మలసి
తాంశువు ఛత్రము, సోన్మదేభముల్
శ్రీ మలయానిలమ్ము, పర
భృత్తతి వందు, లెవాని కాతఁ డీ
కాముఁడు లోకజిత్తొసఁగుఁ
గాత సచ్చైత్రుఁడు మీకు భద్రముల్.

---

# శోధన పత్రము

| పుట | పద్యము | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౮ | ౨౬ | పండుటాకుల | బండుటాకుల |
| ౧౩ | ౧౮ | సోత్సుకసేయ | సోత్సుకుఁజేయ |
| ౧౭ | ౬ | కారఁ | కాఱఁ |
| ౧౯ | ౧౧ | కొలనులిపుడు | కొలఁకులిప్పుడు |
| ౨౬ | ౯ | గలుగ | గలుగఁ |
| ౩౦ | ౮ | ఖేదితోరస్థలలు | ఖేదితోరస్స్థలలు |
| ౧౩ | ౧౧ | కనుచుప్రియ | కనుచుఁబ్రియ |
| ౪౧ | ౨౭ | వందు, లెవాని | వందులు, నేని |

ఆంధ్రపత్రికా కార్యాలయమునందు దొరకు

# ఇతర గ్రంథములు

| | | | |
|---|---|---|---|
| శతకకవులచరిత్ర | 1 | 4 | 0 |
| భగవద్గీతలు-సంస్కృతము (తెనుగులిపి) | | | |
| నాల్గుసంపుటములు. సంపుటము 1-కి | 1 | 8 | 0 |
| ఆరోగ్యసాధనము 0 4 0 మతోద్ధారకుడు | 0 | 12 | 0 |
| శ్రీరామవిజయము | 0 | 4 | 0 |
| నవచోళచరిత్రము 0 12 0 మల్లికాంబ | 0 | 4 | 0 |
| సకలనీతిసమ్మతము | 1 | 8 | 0 |
| మనశ్శరీరములపై పరిసరముల ప్రభావము | 1 | 0 | 0 |
| సత్యవత్యుపాఖ్యానము | 1 | 0 | 0 |
| చంపూభాగవతము | 0 | 10 | 0 |
| వైదికవాఙ్మయచరిత్రము | 2 | 8 | 0 |
| ఆత్మజిజ్ఞాసాసంఘము | 0 | 4 | 0 |
| మానవసత్వములు | 0 | 4 | 0 |
| నిరుద్ధ భారతము 0 5 0 అడవిపువ్వులు | 1 | 0 | 0 |
| శ్రీసోమశైలేశ్వరీయము | 1 | 4 | 0 |
| యెంకిపాటలు 1 0 0 శ్యామసుందరము | 0 | 4 | 0 |
| జాతకఫలమణిమంజరి (మొదటిభాగము) | 1 | 8 | 0 |
| ఐశ్వర్యచింతామణి | 0 | 6 | 0 |
| శ్రీమహర్షి నిఘంటిత యోగశాస్త్రము | 2 | 8 | 0 |

ఆంధ్రపత్రికా కార్యాలయము,
పోస్టుబాక్సు నెం. 212, మద్రాసు.

# ఆంధ్ర విజ్ఞానసర్వస్వము

## మొదటి సంపుటము (రెండవ ముద్రణము)

సంపుటము వెల రూ. ౧౦-౦-౦.

ప్రవేశరుసుము రూ. ౧-౦-౦ మొ. రూ. ౧౧-౦-౦.

ప్రతిసంపుటమున ౮౦౦ పుట లుండును. సంపుటము వెల పదిరూపాయలు

డెమ్మి నాలుగుపుటల సైజున ౮౦౦ పుటలు, మేలైన కాగితము, బంగారు రేకు చెక్కడపు అచ్చుకట్టు, పేరు మొదలయినవి కల చక్కని స్వదేశపు తోలుబైండు.

ఇందు 'అ' నుండి 'అధ్వరము' వఱకు గల నాలుగు వందల పదములకు సంబంధించిన విషయములు చక్కగా వివరింపబడినవి. అందముగ ముద్రితము లయిన రంగుల బొమ్మలు ఎనిమిది, సాదాబొమ్మలు ౧౨౫ ఉన్నవి.

తపాలు వ్యయము ఒకటిన్నర రూపాయి, రైలుద్వారా అయిన, ఖర్చు దూరమునుబట్టి హెచ్చును, తగ్గను వచ్చును. ౧౧-౮-౦ మణిఆర్డరుద్వారా పంపినవారికి పుస్తకము రిజస్టరు తపాలు ద్వారా పంపబడును. వి. పి. గా పంపగోరువారు అయిదు రూపాయలు అడ్వాన్సు పంపవలెను. చిరునామా (అడ్రెసు) స్పష్టముగా వ్రాయవలెను. రైలుద్వారా పంపగోరువారు తమగ్రామమునకు దగ్గరనుండు స్టేషన్ పేరు తెలుపవలెను.

మేనేజరు:—

ఆంధ్ర విజ్ఞానసర్వస్వ కార్యాలయము,

నెం. ౭, తంబుసెట్టి వీధి, మదరాసు.